## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **గీతా దీక్ష** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **గీతా దీక్ష** వారి వెబ్ సైట్: http://www.geetadeeksha.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## గీతా దీక్ష వారి వెబ్ సైట్:

## http://www.geetadeeksha.com



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నింగిని దిగిన సురగంగ

# (గంగావతరణము)




రచన ః

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech.



## సతీ సమేత అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు


Address :

Flat No.5; Plot 61,

Siddardha Apartments,

Siddardha Nagar,

Hyderabad - 500 038, A.P, India

E-Mail : deekshitulu_a@yhaoo.com

Mobile : 9393021360

Website: http://www.geetadeeksha.com/

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# నింగిని దిగిన సురగంగ

# (గంగావతరణము)



రచన :

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech.



**నింగిని దిగిన సురగంగ**

**(గంగావతరణము)**


మొదటి ప్రచురణ

**ఫిబ్రవరి 2010**

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech.

వెల : అమూల్యం

ప్రతులకు :

ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్ధ నగర్,

హైదరాబాద్ - 38. ఫోన్ : 040-23814379

డి.టి.పి. & ప్రింటింగ్ :

కె. మురళీ కృష్ణ

సెల్ : 9848515109




## ముందుమాట

**కం॥ పుత్రోత్సాహము తండ్రికి**
**పుత్రుడు పుట్టంగ కలుగ బోదుర జనులా**
**పుత్రుని పొగిడిన కలుగును**
**పుత్రోత్సాహంబునాడు పుడమిని సుమతీ!**

అన్నాడు శతకకారుడు. ఎంతటి సత్పురుషుణ్ణి కన్నావయ్యా! అనిపొగిడించుకోవటవే నిజమైన సంపద. భగీరథుడిలాంటి పుత్రుణ్ణి కన్న ఒక సామాన్య రాజు జగద్విఖ్యాతి నొందాడంటే కారణమేమిటి తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చదవాల్సిందే. భగీరథ ప్రయత్నం చేశాడండీ ఆ కుర్రవాడు అని ప్రశంసలు పెద్దవాళ్ళు కురిపిస్తుంటే ఎందుకో తెలుసుకోవాలంటే ఈ గంగావతరణం పఠించాలి.

అయోధ్యా రాముడి పూర్వీకుడైన భగీరథుని చరిత్ర విశ్వామిత్రుని ద్వారా ఆనాడు రామలక్ష్మణులు విన్నారు. ఈరోజు మీరు చదువుతున్నారు.



ఆకాశగంగను భూమిపై పారించి తన ముత్తాతలైన సగరులకు స్వర్గం లభింపజేసిన ఆ దీక్షాదక్షుని గాథ అద్భుతం.

పురాణగాథల ముఖ్యోద్దేశం ప్రజలను ఉన్నత భావాలతో ఆదర్శాలతో జీవించి అందరు ఆనందంగా ఉండేట్లు చూడటం. మనం అంతా ఎవరో ఒకరిని ఆదర్శంగా తీసుకొని వారిలా జీవించడానికి ప్రయత్నిస్తున్నవారమే. ఆలోచించండి.

బాగా డబ్బు సంపాదించి సుఖిస్తున్న కొందరినో, అధికారం చెలాయిస్తున్న కొందరినో, భగవంతుని ధ్యాసలో శాంతిని పొందుతున్న కొందరినో, ఐహిక సుఖాలను పొందుతున్న రికామీలను (పనీ పాటలేనివాళ్ళు) చూసి అలా నిశ్చింతగా ఉండాలనో.. ఏదో ఒక ఆంతర్యంతోటే ఉద్దేశ్యంతోటే ప్రతి మనిషీ జీవిస్తున్నాడు. అదంతా వారికి భగవన్నిర్దేశమే అని థీస్ట్ (భగవంతుని నమ్మేవాడు) భావిస్తాడు. అది మనిషి మానసిక పరిపక్వతని బట్టి వస్తుంది అని అథీస్ట్ (నాస్తికుడు) భావిస్తాడు.

ఎవరి అభిప్రాయం వారిది. నేను ఒక్క మాట చెప్పగలను. దేశాన్ని పరిపాలించే మహా మహులు కూడా పాపాయిలుగా ఉన్నప్పుడు బొమ్మలతో ఆడుకొన్నవాళ్ళే. పాపాయిగా ఆనందం ఇచ్చింది యువకుడయ్యాక ఇవ్వటంలేదు. నిజమేకదా! ఆ వయస్సులో క్రికెట్ బ్యాట్ ఇస్తున్న ఆనందం నలభై ఏళ్ళ అదే మనిషికి అదే క్రికెట్ బ్యాట్ ఇవ్వటంలేదు. ఇరవై ఏళ్ళప్పుడు వాడి కానందం ఇచ్చినవేవీ వాడికే ఎనభై ఏళ్ళప్పుడు ఆనందం ఇవ్వటంలేదు. కానీ భగవంతుని ధ్యాసలో ఆనందం పొందగలిగేవాడు ఊపిరాడుతున్నంతవరకు అదే ఆనందం పొందగలడు. ఇది నేను స్వానుభవంతో చెబుతున్న సత్యం.

చెడు ఆలోచనలు రాకుండా భగవంతుడి ధ్యాసలో బ్రతికే ప్రయత్నంలోనే ఋషులు భగవద్గాధలు చెప్పారు.

భగీరధుండు వెయ్యి సంవత్సరాలెలా తపస్సుచేసాడు. అప్పుడేం తిన్నాడు? ఒంటికాలిపై నిలబడి ఎలా తపస్సు చేశాడు? గంగకంటే వేగంగా ఎలా రథంపై పోయాడు?



అసలు భూమిని ఎక్కడన్నా దిగ్గజాలు మోస్తాయా? అరవైవేలమంది పిల్లలకి పాలెవరిచ్చారు? బట్టలెలా కుట్టిచ్చారు. పెద్దయ్యాక వాళ్ళు ఎక్కడ పడుకొన్నారు? ఇత్యాది 'తెలివిగల' ప్రశ్నలకు విశ్వామిత్రుడు, వాల్మీకి ఆఖరికి ఆ బ్రహ్మదేవుడు కూడా సమాధానం చెప్పలేడు.

తను నమ్మిన దానిని భగీరథ ప్రయత్నంతో సాధించడమెట్లాగో చెప్పటమే కానీ, పైన చెప్పిన మేధావుల లాజిక్ వివరించడం గంగావతరణ కథ ఉద్దేశ్యం కానేకాదు.

కొన్నివేల సంవత్సరాలక్రింద ఆనాటి వారి శక్తి సామర్ధ్యాలను మనం ఈనాడు అంచనా వేయలేం. గంగోత్రి దగ్గర జన్మస్థానం చూడటానికి వెళ్తే, నేడు ఇన్ని సౌకర్యాలతో మనకి ప్రయాణమే బహు అసాధ్యమనిపిస్తుంది. అటువంటిది భగీరథ చక్రవర్తి అన్ని శ్రమలకోర్చి పరోపకారానికి అంత శ్రమపడ్డాడంటే సామాన్యమైన విషయం కాదు. జీవితకాలంలో మనం కూడా గంగోత్రిని కనులారా చూడగలిగితే ధన్యులమే కదా!



మన తాతలకు, తండ్రులకు పితృకార్యం చేయ సంకల్పం ఉన్న పుణ్యాత్ములకు నేటికాలంలో ఎన్నో సౌకర్యాలున్నాయి. డబ్బు కిబ్బంది లేకపోతే నేటికాలంలో శాస్త్రోక్తంగా అపరకర్మలు చేయవచ్చు. తర్పణాలు విడువవచ్చు. గయ, కాశి వెళ్ళి పితృదేవతలకి పుణ్యగతులు కల్పించవచ్చు.

స్థిర సంకల్పం ఉంటే గయ, కాశి, గంగోత్రి వెళ్ళలేనివారు శ్రీపాదగయ (కాకినాడ దగ్గిర ఉన్నది) వెళ్ళి దాదాపు అదే ఫలితం పొందవచ్చు.

ఆఖరికి ఒక చిన్న విన్నపం. మీ తల్లిదండ్రులు మీకు జన్మనిచ్చి పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులనిచ్చి మీరు ఇంతవటానికి అంత శ్రమపడ్డారు కదా. వారు చనిపోయిన రోజున ఎవరైనా ఒక గుళ్ళో పూజారికి ముగ్గురు వ్యక్తులు భుజించగలిగిన 'పదార్ధములు' ఇచ్చి ఒక వంద రూపాయలిచ్చి భక్తితో నమస్కరించలేరా? సూపర్ బజార్లు డోర్ డెలివరీస్, సెల్ ఫోన్సున్న నేటి సమాజంలో ఏదీ కష్టంకాదు..ఇష్టంలేకపోతే ఏదైనా కష్టమే. మీరు భగీరధుడంత కష్టపడక్కర లేదు.



ఇకపోతే ఈ రచన గురించి, దీనికి మూలం వాల్మీకి రామాయణంలోని బాలకాండ (ముప్పది ఎనిమిది నుంచి నలుబది నాలుగవ అధ్యాయాలు) నూటికి తొంబది ఎనిమిది వంతులు యధాతథంగా వివరించాను.

భగీరధుని ఈశ్వరస్తుతి మాత్రం నా చేర్పిడి. నేను శ్రీనారాయణ భట్టతిరి కృతి శ్రీమన్నారాయణీయమ్ దశమస్కందం పద్య కావ్యంగా చేస్తున్నప్పుడు మాతృకవల్ల పరమేశ్వర నింద వ్రాయవలసివచ్చింది. శివాపరాధం క్షమార్హం కాదు. దానికి ప్రాయశ్చిత్తం శివమహాత్మ్యం చెప్పే రచన చేయటమే. అందుకే ఈ గంగావతరణంలో ఇంత సుదీర్ఘమైన శివస్తుతి చేర్చాను.

మూలంలో దాదాపు ప్రతిశ్లోకంలోను రామచంద్రుని విశ్వామిత్రుడు సంబోధించే కథ చెబుతుంటాడు. భరతర్షభ! రాఘవ! పురుష శ్రేష్ఠ! రామా! మహాబాహో! ఇత్యాది సంబోధనలు యధాతథంగా వ్రాసి కథాగమనంలోని రసస్ఫూర్తికి ఇబ్బంది కలుగకుండ ఉండాలని నేను మాతృకలోని సంబోధనలు విడిచిబుచ్చాను. మిగతావన్నీ యధాతథంగా చెప్పబడినవే.

## ప్రార్థన

కంll శ్రీపతి పాదోద్భవమై
ఆ పన్నుల సగర సుతుల నందరి బ్రోవన్
అ పరమేశుని తలపై
ఆపై దిగివచ్చె గంగ అవనీతలికిన్

కంll హరిహరుల కరయగా నం
తరమది సరికాదు, నరులు తరియించుటకై
పరిపరి తెరవుల కొలతురు
పురవైరియు మురవిరోధి యొకరే అరయన్



మll శివనామంబు జపించలేని నరుడా!
చింతించి వ్యర్థంబురా
అవనిన్ మానవజన్మ కల్గె నరయన్
అజ్ఞాన సామ్రాట్టువై
అవధుల్ లేని వినమ్రతన్ అనవుగా
ఆర్తిన్ "హరా! బ్రోవరా"
కవనం బేటికి? స్వామి భక్తి మదిలో
కాపై సదా నిల్వకన్.

ఉll శైల సుతామనోవిభుడు సద్గతు
లిచ్చెడి గంగ 'భర్తకున్'
మేలుగ మ్రొక్కి ఈ కథను మించిన దీక్ష
పఠించు మిత్రమా!
పాలసముద్రమున్ జిలుకవచ్చిన అమృత
మిద్ది గ్రోలుమా
చాలనవద్దు తథ్యమిది స్వర్గము గందురు
పితృదేవతల్



చంll మును తమ పితృదేవతలు మోక్షము
నొందగ వారికోసమై
తను గొనివచ్చె యత్నమున ధాత్రి భగీరథ
చక్రవర్తియున్
గొనకొని 'నింగి గంగ' తనకూడ వరంబుగ
ధన్యుడయ్యె, నే
ననువుగ దీని వ్రాసితిని 'ఆప్తులు'
'పెద్దలు' పొంద ముక్తినిన్



## అంకితము

చంll
వినుటయెగాని తాతలను పెద్దలనెప్పుడు
విందు జేయగా
కనులకు గాంచనైతి తమకంబున ఎంతటి
మందభాగ్యుడన్!!
మనసున ప్రీతితో తలచి మానక 'తర్పణ'
లిచ్చుచుంటి,నే
ననుపమ భక్తిమ్రొక్కి కృతినంకిత మిత్తును
వారికీశ్వరా!

తాll ఓ సర్వేశ్వరా! నా తాతగారు మొదలైన నా పూర్వీకుల గురించి వినటమే కాని కనులారా చూడనోచుకోని దురదృష్టవంతుడను. అయినా నా మనస్ఫూర్తిగా ఆనందంతో వారికి తర్పణలనిస్తూనే ఉన్నాను. ఇప్పుడు నేను నీదయచే వ్రాసిన ఈ గంగావతరణ కృతిని అనుపమ భక్తితో మ్రొక్కి వారందరికి దీనినంకిత మిచ్చెదను గాక!

## ఉపోద్ఘాతము

అయోధ్య కేతెంచి, దశరథునొప్పించి, రామ లక్ష్మణు లిద్దరిని తనయాగసంరక్షణార్థం తోడ్కొని పోతున్నాడు విశ్వామిత్రమహర్షి. భవిష్యత్తులో శ్రీరామచంద్రమూర్తిచే జరుగబోవు రాక్షస సంహారము తెలిసినవాడైనందున రామలక్ష్మణులకు ఆకలి దప్పులబాధ తెలియకుండా బల అతిబల అను విద్యలే గాక ఎన్నో దివ్య శస్త్రాస్త్రములను వారికి ప్రసాదించాడు విశ్వామిత్రుడు.

మార్గాయాసం తెలియకుండా వారికి ఎన్నో దివ్యగాధలనెరిగించాడు. సమస్తము తెలిసిన సర్వేశ్వరుడు అయినా, లక్ష్మణుని కోసం ఏమీ తెలియని వాడిలా ఎన్నో సందేహాలు నివృత్తి చేయించాడు ఆ పరంధాముడు. జలజల పారుతున్న గంగానదిని జూచి దేవలోకంలో ఉండే ఆకాశగంగ అసలు భూమి మీదికెట్లు వచ్చింది అని అడిగిన ఆ దాశరథి సందేహానికి సమాధానం చెబుతూ “నాయనా! రామచంద్రా! ఈ గంగావతరణ నీ పూర్వీకుడైన భగీరథ చక్రవర్తి వల్ల జరిగింది. ఆ కథ పరమపావనము. దీనిని గ్రహింపుము, అని చెప్పనారంభించాడు ముని.



## నింగిన దిగిన సురగంగ (గంగావతరణము)

పూర్వము అయోధ్యా నగరమునకు రాజుగా సగరుడు ప్రజారంజకముగా పరిపాలించుచుండెను.
యుద్ధరంగమున వెనుకడుగేయుట నెరుంగని ఆ నృపతి కడు ధర్మాత్ముడు.

ఆయన మొదటి భార్య విదర్భ రాజపుత్రిక అయిన కేశిని. మిక్కిలి ధార్మికురాలైన ఆమె సత్యవాది కూడ.

భూలోకమున ఎన్నదగిన సౌందర్యరాశియైన రెండవ భార్య సుమతి కశ్యపుని గారాల కూతురు. ఈమె అన్నగారే గరుత్మంతుడు.

సగర చక్రవర్తి ఇరువురు భార్యల యందును సంతానము నరయక హిమవత్పర్వతమును జేరి యందు భృగు ప్రస్రవణము అనునొక కొండపై తపంబు చేయసాగెను.



అట్లా చక్రవర్తి నూరు సంవత్సరంబులు తపంబు నొనర్చిన పిమ్మట సత్యవంతులలో అగ్రగణ్యుడైన భృగుమహాముని ఆయన తపమునకు సంతసించి ఆయనకు వరమునను గ్రహించ దలంచెను.

“పాపరహితుడవైన సగర చక్రవర్తీ! నీకు మిక్కిలి అధికమైన సంతానము కలుగును. పురుష శ్రేష్ఠుడవైన ఓ మహారాజా! నీవు ఈ లోకమున సరిలేని యశస్సును గాంచెదవు.

నాయనా! నీ భార్యలలో నొకతె వంశకరుడైన పుత్రునొక్కని గనును. రెండవయామె వంశకరులు గాని అరువది వేలమంది పుత్రులను కనును” అని యా భృగువు వరము ప్రసాదించెను.

ఇట్లు చెప్పుచున్న ఆ భృగుమహర్షిని జూచి రాణులు కేశిని మరియు సుమతి మిక్కిలి సంతోషించిరి. ఆయనకు నమో వాకముల నర్పించి రాణులిట్లడిగిరి.



“బ్రాహ్మణోత్తముడవైన ఓ భృగుమహర్షీ! మాలో ఎవ్వతెకు నొక్క పుత్రుడగును? ఎవ్వతె అరువది వేలమందిని కనును? దీనిని మేము వినగోరెదము. నీవెట్లు చెప్పిన అట్లే జరుగుగాక! మేము నీ నిర్ణయమున కంగీకరింతుము.”

వారి మాటలకానందించిన భృగుమహర్షి చక్రవర్తిని జూచి మందహాసముతో నిట్లనెను.

**ఉ॥ ఎవ్వతెకోరునో సుతుని ఇంతికి**
**వంశకరుండు నొక్కడా**
**అవ్వనితా శిరోమణికి; అర్వది వేవురు**
**పుత్రశ్రేణినిన్**
**ఎవ్వతె కోరునో కలుగు నింకొక నాతికి**
**కీర్తిశూన్యులౌ**
**నువ్విక నిర్వహింపు మిది నూతన ఒర్వడి**
**నిల్పు భూవరా!**

(తా॥ఓరాజా! నీ భార్యలలో ఎవ్వతె ఒక్క కుమారుని కోరుకొంటుందో వాడు వంశకారకుడైన పుత్రుడవుతాడు. రెండవ ఆమెకు అరువది వేలమంది పుత్రులు కలుగుతారు. బలపరాక్రమములుండి కూడ వారు కీర్తిని సంపాదించరు. కావున ఇప్పుడు నువ్వు కాగల కార్యము నిర్వహించి నీ భార్యల కోరికల నెరవేర్పుము.)

అంత రాజపత్నులలో జ్యేష్ఠురాలైన కేశిని ఒక్కపుత్రుడు గావలెనని సహజముగ కోరుకొనెను.

గరుత్మంతుని తోడంబుట్టిన సుమతి అండజములకు సహజమైనట్లుగా బహు సంతానమును కోరెను. ఆమెకు అరవది వేలమంది పుత్రులు కలిగెదరు.

రాజు తన భార్యలతో సహా మునీశ్వరునికి ప్రణమిల్లి తన పట్టణమునకు తరలిపోయెను.

గర్భధారణ కాలమగు నవమాసములు ఇరువురు రాణులకు గడచినవి. పెద్దరాణి కేశిని అసమంజుడను పేరుగల ఒక పుత్రుని ప్రసవించినది.



రెండవ భార్య సుమతి పెద్ద సొరకాయను బోలిన గర్భపిండము నొక్కంటిని కన్నది. దానిని విచ్ఛిన్నము సేయగనె అందుండి అరువది వేలమంది సూక్ష్మరూపులైన సుతులు ఉద్భవించిరి.

దాదులా శిశువులను నేతికుండలలో నుంచి పెంచిరి. దీర్ఘకాలమైన తరువాత ఆ శిశువులు యౌవనము నొందిరి.

ఇక ఆ సగరుని జ్యేష్ఠపుత్రుడు ఎంత దుర్మార్గుడంటే..

**సీ॥ ఎల్లవేళలయందు పిల్లమూకల గూడి**
**సల్లాపముల్ పెక్కు సలుపుచుండు**
**సరయూ తరంగిణిన్ వారల పడద్రోసి**
**పకపక నవ్వుచు పరిహసించు**
**పనివడి ధూర్తుడై పట్టణ వాసులన్**
**పాపిష్ఠి నడతతో బాధవెట్టు**
**పెద్దలన్ నిరసించు నొద్దిక నెరుగడు**
**హద్దుమీరిన క్రౌర్యమతని సొత్తు**



**తే॥ వాన్కి అసమంజుడను పేరు బహుతగినది**
**కడుపు చెడబుట్టెనేయని కంటినీరు**
**వెట్టి సగరుడు పుత్రుని తిట్టిపోసి**
**రోసి నగర బహిష్కృతున్ జేసివైచె.**

(తా॥ఆ సగరుని జ్యేష్ఠపుత్రుడు పిల్లవాళ్లతో ఎల్లప్పుడూ ఆడుచు వారిని బట్టుకొని సరయూనది జలములలో బడద్రోసి వారు ఆ జలములలో మునిగి పోతుంటే పకపక నవ్వుచుండును.

పాపిష్ఠి నడతతో మంచి వారిని బాధించును, నగర వాసులకు అనిష్టంబులు సేయుచుండును. పెద్దలను నిరసించును. నమ్రతనెరుగడు హద్దుమీరిన క్రౌర్యము వానిసొత్తు.

వాడికి అసమంజుడు అనుపేరు సరిగ్గా అతికినట్లు సరిపోయింది. ఆ సగర చక్రవర్తి అయ్యో! ఇలాంటి అప్రయోజకుడు పుట్టాడే అని తిట్టిపోసి, రోసి అతనిని నగర బహిష్కృతుని చేశాడు)



అసమంజునకు పరాక్రమశాలియైన ఒక పుత్రుడు కలడు. వానిపేరు అంశుమంతుడు. సత్యవ్రతుడును ప్రియభాషియును అయిన ఆతడు కులదీపకుడు.

అట్లు దీర్ఘకాలము గడచిన పిదప సగరునకు అశ్వమేధయాగము చేయవలెనను తలంపు కలిగినది.

అప్పుడు వేదవేదార్థముల నెరింగిన ఆ సగర చక్రవర్తి ఋత్విక్కులను రావించి యాగకార్యమున కేర్పాట్లు గావించి కృత దీక్షాదక్షుడై యాగము నారంభించెను.

**బ్రహ్మర్షి విశ్వామిత్రుని ముఖతః గంగావతరణ గాథనాలకించుచున్న శ్రీరామచంద్రుడు ఆయనను జూచి తన కూటస్థుడు (మూలపురుషుడు) సగర చక్రవర్తి అశ్వమేధ యాగము నారంభించెనని విని మిక్కిలి సంతోషించి జ్వలించు అగ్నిహోత్రుని వలె ప్రకాశించుచున్న ఆయనతో నిట్లనెను.**

**"బ్రహ్మర్షీ! మీకు మంగళమగు గాక! సగర చక్రవర్తి యాగమునెట్లు పూర్తి చేసెనో వివరింప ప్రార్థించెదను".**

**విశ్వామిత్రుడు "ఆహా! సర్వము నెరింగియు ఏమియు తెలియని వానివలె తమ్ముడు లక్ష్మణుని కోసం ఈ కథ వివరముల నడుగుచున్న ఇతడు సుగుణాభిరాముడు" అని ఆ రాముని జూచి గంగావతరణమును మహర్షి ఇట్లు చెప్పసాగెను.**

పరమేశ్వరుని మామగారైన హిమవంతుడు హిమవత్పర్వతము. దాని సరితూగునది వింధ్యపర్వతము. పరస్పరము చూచుకొనునట్లున్న ఈరెండు పర్వతముల మధ్యనున్న పీఠభూమి యాగములు సేయుటకు కడు ప్రశస్తమైనది.

సగర చక్రవర్తియాగము అట్టి ప్రదేశములో ప్రారంభింపబడినది. అశ్వమేధయాగమున చక్రవర్తి యాగాశ్వమును యధేచ్ఛ బోవంజేసి దానినెవ్వరూ అడ్డగింపక నమస్కరించి మ్రొక్కునట్లు సేయవలెను. ఆ విధముగా చక్రవర్తి తన ఏకచ్ఛత్రాధిపత్యమును చాటుకొనును. యాగాశ్వము వెంట దాని రక్షకుడు



సాయుధులైన సేనతో వెంబడించి అనర్థములు జరుగకుండ సంరక్షించుచుండును.

సగరుని పనుపున ఆయన మనుమడైన అంశుమంతుడు, పదునొకండు వేల మంది విలుకాండ్రతో ఒకేసారి పోరాడు పరాక్రమము గలవాడై నందున ఒక రథముపై ఆ యాగాశ్వమును అనుసరించెను.

అదిచూచి సహించలేని ఇంద్రుడు యాగాశ్వము నపహరించనెంచెను.

**ఆ.వె.॥ దనుజ రూపుదాల్చి తరలెను పాకారి**
**"ఉక్థ్య" మపుడు జరుగుచుండె నచట,**
**అపహరించివైచె యాగాశ్వమున్; లేమి**
**ఋత్విజులకు తెలిసె సత్వరముగ.**



(తా॥ఇంద్రుడు రాక్షస రూపమును ధరించి యాగములో "ఉక్థ్యము" జరుగుచున్నప్పుడు సగరచక్రవర్తియొక్క అశ్వమేధయాగాశ్వమును అపహరించెను. అశ్వము 'లేక పోవుట' ఋత్విజులకు వెనువెంటనే తెలిసిపోయినది)

ఋత్విజులు చక్రవర్తితో నిట్లనిరి. "రాజా! ఉక్థ్యము జరుగుచున్నపుడు యాగాశ్వము అపహరింపబడినందున అపహరించినవానిని జంపి యాగాశ్వమును దెచ్చి యాగమును నీవు పునరుద్ధరించవలెను. అట్లు సేయవేని ఆ దోషము వలన మనకందరికి కీడు సంభవించును. కావున ఏ అపరాధము జరుగకుండ సర్వము చక్కబడునట్లు సేయుము".

అంతనా సగర చక్రవర్తి తన అరువది వేవురు పుత్రులను పిలిపించి ఇట్లు చెప్పెను.

"పురుష శ్రేష్ఠులైన పుత్రులారా! ఈ అశ్వమేధ యాగము పూజ్యులైన ఋత్విజులచే ననుష్ఠింపబడుచున్నది. వారు మంత్రజ్ఞులైనందున రాక్షసులకీయాగాశ్వము



నపహరించు శక్తి సామర్థ్యములుండవు. అట్లు నేను భావింతును.

నాయనలారా! గుఱ్ఱము నపహరించినది వీరని మనమెరుంగము. కావున దానికై గాలించి వెదకుటొక్కటే తరుణోపాయము. మీకు మంగళమగుగాక! సముద్ర మధ్యమున నున్న భూమి నంతయు గాలించి వెదకుడు.

మీరు ఒక్కొక్కరు ఒక ఆమడ పొడవు ఒక ఆమడ వెడల్పుగల భూమిని వెదకుడు.

నాయాజ్ఞ చొప్పున అశ్వమునకై భూమిని త్రవ్వి పాతాళమునకైనను పోయి కార్యము సాధించుడు. పుత్రులారా!

**కం॥ దీక్షితుడ బిడ్డలారా!**
**దీక్షను విడనాడలేను తేకొని మీరే**
**దీక్షాశ్వమ్మును వెదకుడు**
**దీక్షగ గాలించి అవని తెండిటు శుభమౌ.**

తా॥ ఓ పుత్రులారా! నేను దీక్షితుడను. యాగదీక్షను విడిచి బుచ్చలేను. కావున మీరే యాగదీక్షాశ్వమ్మును వెదుక వలెను. మీకు శుభమగును. దీక్షగా భూమి గాలించి అశ్వమును తీసికొని రండు.

నేను యాగదీక్షలో ఉంటే నా మనుమడు అంశుమంతుడు ససైన్యంబుగా రాజ్యమును రక్షించుచుండును”

మహాబలులైన ఆ రాకుమారులు సగరుని ఆజ్ఞను శిరసావహించి భూమియందు వెదుక జొచ్చిరి.

తండ్రిచెప్పినట్లు ఆ అరువదివేలమంది ఒక్కొక్కరు ఒక్కొక్క చదరపు యోజనము వైశాల్యమున్న మేర భూమిని వెదకిరి. కఠినములై వజ్రతుల్యములైన తమ నఖములతో భూమినంతయు ద్రవ్విపోసిరి.

వజ్రాయుధముల వంటి శూలములతో మరియు పెను నాగళ్ళతో వారు భూమిని వ్రయ్యలు చేయుచుండగా గొప్పధ్వనులు ఆవిర్భవించినవి.



వారి ఆయుధముల ధాటికి సర్పములు, అసురులు రాక్షసులు మరియు నితర జంతువులు నలగగొట్టబడి ఆక్రందనలు చేయుచుండగా ఆ ధ్వని వినుటకు శక్యము కాకుండెను.

వారు పాతాళమును చేరుదురా అన్నట్లు అరువది వేల యోజనములు వైశాల్యముగల భూమిని త్రవ్విరి.

పర్వతములతో నిండిన జంబూద్వీపమును ఆ రాకుమారులు త్రవ్వుచు తిరుగాడిరి.

దేవదానవ పన్నగ జాతులన్నియు వెళ్ళి బ్రహ్మదేవుని సందర్శించి తమగోడు వెళ్ళగ్రక్కినవి.

పరమేష్ఠిని వినుతించి వారు తమ భయమును ఇట్లు వెళ్ళ గ్రక్కిరి.

“భగవంతుడవైన ఓ పరమేష్ఠీ! సగరుని పుత్రులు యుక్తాయుక్త విచక్షణలేక భూమినంతయు ద్రవ్వుచున్నారు. పాతాళమందున్న మహాత్ములను నిర్దోషులను నిర్దోషులైన తాపసులను సంహరించుచున్నారు.



**కం॥ ఇతడే సవనము జెరచెను**<br>
**ఇతడే మన హయము దెచ్చి ఇంతలు చేసెన్**<br>
**ఇతనిని వధింపుడిపుడే**<br>
**హితవగునని జంపసాగిరెల్లర మూర్ఖుల్.**

(తా॥ “ఇతడు మన యాగమును జెరచిన పాపాత్ముడు. ఇతడే మన యాగాశ్వమును దొంగిలించెను. వీడి నిప్పుడే వధింపుడు అదే మంచిపని'' అని ఆ మూర్ఖులు అమాయకులను వధించసాగిరి)

ఆ విధంగా అందరు ముక్తకంఠంతో బ్రహ్మదేవునికి విన్నవించిరి. భగవంతుడగు ఆ పరమేష్ఠి దేవాదుల పలుకుల నాలకించి దైవ బలంబుచే ఇట్లు జననాశనము జేయుచున్న సగరపుత్రుల భీతిచే మోహితులైయున్నవారిని జూచి ఇట్లనెను.

“ఈ భూమియంతయు ఏ విష్ణుమూర్తిదో. ప్రస్తుతము ఆ స్వామి కపిలమహర్షి రూపమును ధరించి ఈ



భూభారమును వహించుచున్న వాడు. ఆ కపిలుని కోపాగ్నియే ఆ సగరపుత్రులను దహించి వేయగలదు.

భూమిని త్రవ్వి సగరపుత్రులు అల్పాయుష్కులై చావును ఆహ్వానించి యున్నారు. ఇది అవశ్యము కాదగినపని అని ఈ వరకే నిశ్చయింపబడినది”

బ్రహ్మదేవుని ఆ పలుకులకు అష్టవస్తువులు, ద్వాదశ ఆదిత్యులు, ఏకాదశ రుద్రులు, అశ్వనీదేవతలు మొదలైన సురులు, దైత్యులు సంతసించిరి. వారు తిరిగి వారి వారి నెలవులు జేరిరి.

ఇంతలో సగరపుత్రులచేటును సూచించుచు పిడుగుపాటువంటి ధ్వని వినవచ్చినది. వారు ఏమి చేయుటకు తోచక వెనుదిరిగి సగర చక్రవర్తివద్దకు వచ్చి ఇట్లనిరి..

చం॥

**అనుపమ లీలనీ అవనినంతయు జుట్టితి**
**మయ్య! మేము ఆ**
**అనిమిష, దైత్య, రాక్షసుల కాయువు మూడెను**
**చంపి పెక్కులన్**
**కనుగొనకుంటిమశ్వమును, గాంచము చోరుని**
**యెందు నైననున్**
**జనక! తలంపుతోచదిక చక్కని యోచన**
**జెప్పు మిత్తరిన్**

(తా॥తండ్రీ! మేము గొప్ప దీక్షతో ఈ భూమినంతయు జుట్టితిమి. బలశాలులగు దేవతలను దైత్యులను, రాక్షసులను, పిశాచంబులను, సర్పములను, కిన్నెరులను చాలమందిని సంహరించితిమి. కాని అశ్వముగాని దాని నపహరించిన దొంగగాని మాకు ఎక్కడా కనిపించలేదు. మాకు ఏమి చేయవలెనో తెలియకున్నది. మాకు నీవే ఏదైనా చక్కని యోచన తెలుపుము)



తనకుమారులు చెప్పిన మాటలను వినిన రాజశ్రేష్ఠుడైన సగరచక్రవర్తి కోపించి వారితో ఇట్లు పలికెను.

"మీరు మరల భూతలమును భేదించి త్రవ్వుడు. హయమును, హయమునపహరించిన వానిని బట్టికొని కృతార్థులై మఱలిరండు. మీకు మంగళమగుగాక!"

అంతనా అరువదివేలమంది సగరులు భూమిని ద్రవ్వుటకు పరువులిడిరి. అట్లు వారు భూమిని ద్రవ్వుచు బోయి విరూపాక్షమను దిగ్గజమును జూచిరి. ఆ విరూపాక్షము పర్వతములును మహారణ్యములుగల భూమండలమును శిరంబును నిడుకొని మోయుచున్నది.

విరూపాక్షమను ఆ దిగ్గజము డస్సి అలసట దీర్చుకొనుటకు తన తలను కదలించును. అప్పుడు భూకంపములు కలుగుచుండును.

ఆ సగరులు ఆ మహాదిగ్గజమును గాంచి వినయముతో బ్రదక్షిణముజేసి పూజించి భూమిని భేదించుకొనుచు బోయిరి.



అట్లు తూర్పుదిక్కున త్రవ్వి ఏమియు గానక దక్షిణ దిక్కున ద్రవ్వ నారంభించిరి. అచ్చట వారు మహాపర్వతమునకు సాటిరాగల 'మహాపద్మము' అను దిగ్గజమును జూచిరి. తన శిరమున భూభారమును దక్షిణమునుండి మోయుచున్న ఆ దిగ్గజమును అత్యంతాశ్చర్యముతో జూచిరి దానికి కూడ వినయముగా ప్రదక్షిణముగావించి తదనంతరము ఆ రాకుమారులు పడమటి దిక్కున భూమండలమును కృతనిశ్చయులై త్రవ్వ నారంభించిరి.

**ఆ.వె॥ పశ్చిమమున ద్రవ్వి పరికించి కొండంత**
**"సౌమనసము" దిగ్గజమును వారు**
**జరిపి వందనంబు ఆరోగ్యమును బుచ్చి**
**ఉత్తర దిశ ద్రవ్వి రుద్యమించి.**



(తా॥సగరపుత్రులు ఆ విధముగ పడమటి దిక్కున ద్రవ్వుచు బోయి ఆ దిక్కున భూభారమును వహించుచున్న 'సౌమనసము' అను కొండంత ఆకారముగల దిగ్గజమునకు వందనమాచరించి కుశలప్రశ్నలడిగి అటుపిమ్మట హిమపర్వతమున్న ఉత్తరదిక్కున ద్రవ్వుచు బోయిరి.

ఉత్తర దిక్కున మంగళకరమైన తెల్లని దేహముతో మంచువలె మెరయుచున్న 'భద్రము' అను దిగ్గజమును జూచిరి.

ఆ భద్రమును గౌరవార్థము తాకి ప్రదక్షిణించి ఆపైన అచటి భూమిని త్రవ్విరి. ఏమియు కానరాలేదు. వారి కోపమున కంతు లేకుండ బోయినది. సగరపుత్రులు ఈశాన్యదిక్కున త్రవ్వ నారంభించినారు.

మహాబలులై గొప్ప శరీరములు వేగముగల ఆ సగరపుత్రులకు ఈశాన్యదిక్కున కపిల రూపమును వహించియున్న సనాతనుడగు విష్ణుదేవుడును అతని సమీపమున దిరుగుచున్న యాగాశ్వమును జూపట్టి అపరిమితమైన ఆనందము కలిగినది.

ఆ సగరపుత్రులు ఆ కపిలమహర్షిని గుఱ్ఱపు దొంగగా దలంచి కుపితులై కలతపడిన మనస్సు కలవారై నాగళ్ళతోను, నానా విధములైన వృక్షంబులతోను, ఱాళ్ళతోను "ఓరీ నిలు నిలు" అని అదలించుచు ఆ కపిల మహామునిపై బరుగెత్తిపోయిరి.

"నీవు మా యాగాశ్వమును అపహరించితివి. దుర్మార్గుడా! మేమెవ్వరనుకొనినావు? మేమే సగర చక్రవర్తి యొక్క పుత్రులము. మేమిక్కడకు వచ్చియున్నామని ఎరుంగుము అని" పలికిరి

ఆ సగరపుత్రుల మాటలను విని కపిల మహర్షి రోష కషాయ నేత్రుండై మిక్కిలి కోపంబు నొంది భయంకరమైన 'హుంకారము' ను జేసెను.

అంత కొలతలు లేని ప్రభావముగల ఆ మహాత్ముని ఎదుట నిలిచిన ఆ అరువది వేల మంది సగరపుత్రులు బూడిదరాసులై పోయిరి.



ఇట్లు బహుకాలంబు గడచెను. ఎన్నాళ్ళకు తనపుత్రుల జాడ తెలియక పోవుటచే సగర చక్రవర్తి యాగము మధ్యలో ఆగిపోయినందుకు వ్యాకులుడై చివరకు తనమనుమడైన అంశుమంతుని పిలిపించెను. నిజ తేజంబుతో బ్రకాశించుచున్న తన మనుమని జూచి సగరచక్రవర్తి ఇట్లనెను.

**సీ।। శస్త్రాస్త్రములయందు సర్వసమర్థుండ**
**వీవె నీ పూర్వుల కవును సాటి**
**కనుగొనుమెటులైన మనుమడా! వెదకుము**
**అశ్వపుదొంగని అవని దొలచి**
**ధరలోని జంతువుల్ సరిలేనివౌటచే**
**ఆయుధములతోడు బాయరాదు**
**మాన్యుల నెప్పుడు మానక బూజింపు**
**వినయమే నగ సుమ్మి! విలువచెడదు**



**తే।। విఘ్నమొనరించి యాగము వీగిపోవ**
**అశ్వమును బూని చాటుగా నపహరించు**
**వాని జంపుము కొని తెమ్ము వారువమును**
**కలుగు శుభములు నాయనా! కనుము కీర్తి.**

(తా।।నాయనా! అంశుమంతా! నీవు శూరుడవు. శస్త్రాస్త్రముల యందు సర్వసమర్థుడవు. పరాక్రమమునందు నీ పూర్వీకులకు సరితూగు వాడవు. నీవు పోయి దీక్షతో యజ్ఞాశ్వమును వెదకుము.

భూమికి లోపలనుండు జంతువులు చాలపరాక్రమము గలవి. సాటిలేనివి. అందుచేత వానిని సంహరించుటకు నీవు ఖడ్గములు, ధనస్సులు మొదలైన ఆయుధములను తోడ్కొని పోవలయును.



నీవు నమస్కరింపదగిన వారికి నమస్కరింపుచు వినయ భూషణుడవై ఉండవలెను. విఘ్నము సలుపుటకు మనయాగాశ్వమును అపహరించిన వానిని సంహరించి అశ్వమును తోడ్కొని రమ్ము. నీకు శుభమగు గాక! నా యాగమును పూర్తిచేయించిన కీర్తి నీకు కలుగుగాక!)

ఈ ప్రకారము మహాత్ముండగు సగరచక్రవర్తి లెస్సగా నాజ్ఞాపించగా అంశుమంతుడు ధనస్సు ఖడ్గములను ధరించి చురుకుగా అశ్వమును వెదకుచు బోయెను.

అతడు వీరాధి వీరులైన తన తండ్రులు భూమియందు త్రవ్విన మార్గముగుండా పయనించెను.

మహా పరాక్రమశాలియైన అంశుమంతుడు దైత్య, దానవ, రాక్షస, పిశాచ, పక్షి, సర్ప జాతులచే బూజింపబడుచున్న ఒక దిగ్గజమును గాంచెను.

అతడా దిగ్గజమునకు బ్రదక్షిణము సేసి, ఆరోగ్యమునడిగి, "మాతండ్రు లెచటనున్నారు? గుఱ్ఱపు దొంగ జాడ ఏది తెలుపవలసినది" అని అడిగెను.

ఆ దిగ్గజము అంశుమంతుని జూచి "అంశుమంతా! నీవు కృతార్థుడవై శీఘ్రమే అశ్వంబుతో బోగలవు" అని చెప్పెను.

అటు పిమ్మట అంశుమంతుడు తక్కిన దిగ్గజములను వరుసగా గాంచి అట్లే జేసెను. అన్ని దిగ్గజములు అతనిచే సంతుష్టులైనవి. అవి వాని నాశీర్వదించినవి.

**కం॥ ఇతరుల అభిమత మెఱుగుచు**

**అతి ప్రీతిగ మాటలాడు ఆ దిగ్గజముల్**

**అతనికి జెప్పిన విత్తరి**

**"అతిత్వరలో నీకభీష్టమవును సుపుత్రా!"**

(తా॥ ఇతరులు చెప్పు మాటలయందలి మనోగత అభిప్రాయములెరిగి యుక్తముగ మాటలాడగలిగిన ఆ దిగ్గజములన్నియు అంశుమంతుని ఆదరించి "నాయనా నీవు శీఘ్రముగా నీ అభీష్టము నొందెద" వని దీవించినవి)



ఆ దిగ్గజములు చెప్పిన మాటలు విన్న అంశుమంతుడు శీఘ్రముగ నడచి తన తండ్రులైన సగరపుత్రుల బూడిద రాసులున్న ప్రదేశమును చేరుకొనెను.

అంతవరకు తన తండ్రులైన సగర పుత్రుల పొడగాంచనైతినేయని దుఃఖించిన ఆ అసమంజస సుతుండు తన కట్టెదుట నున్న బూడిద రాసులను జూచి మిక్కిలి ఆర్తుడై రోదించెను.

అట్లు దుఃఖవివశుడైన అంశుమంతుడు అచటికి సమీపముననే తిరుగాడుచున్న యాగాశ్వమును గాంచెను. వారికి తర్పణము లొదలవలెనని అంశుమంతుడనుకొనెను కాని కొలను కాదు కదా అతనికి చుక్క నీరైనా లభ్యము కాలేదు.

అట్లు నీటికై వెదకుచున్న అంశుమంతునికి నీరు కనపడలేదు కాని తన పినతండ్రులకు మేనమామయు వేగంబున వాయుదేవుని సాటి వాడును అయిన పక్షీంద్రుడు గరుత్మంతుడు కనబడెను.



మహాబలాఢ్యుడైన ఆ ఖగపతి దుఃఖవివశుడైయున్న అంశుమంతుని జూచి ప్రేమగా ఓదార్చుచు ఇట్లు పలికెను.

**సీ॥ వీరల మరణంబు మురిపించె జగముల**
**నాయనా! చింతించ నయముకాదు**
**కపిలుని క్రోధాగ్ని తాపంబుచే వీరు**
**బూడిదరాసులై పోయినారు**
**యెల్ల ధర్మంబుల నెరిగిన వాడవు**
**జలతర్పణం బెట్లు జరుపగలవు?**
**లౌకిక జలముల లాభంబు లేదయా**
**సురగంగ కావలె వీరిబ్రోవ**

**తే॥ ప్రథమ పుత్రిక ఆ హిమవంత గిరికి**
**గంగ, పావన నదియామె నింగినుండి**
**వారి భస్మరాసులపైన పారినంత**
**స్వర్గమందెదరయ్య! ఈ సగరసుతులు.**



(తా॥ ఓ అంశుమంతా! వీరల చావు, లోకంబుల కన్నింటికి సమ్మతంబైనది. కావున నీవు దుఃఖింపవలదు. మహాబలవంతులగు వీరు అమిత ప్రభావ శాలియైన కపిలమహామునిచే దగ్ధము చేయబడిరి. నీవు సర్వధర్మముల నెరింగినవాడవు. వీరికీ లోకము నందున్న జలములచే తర్పణములిచ్చిన ఫలితము లుండవు. వీరిని పునీతులను సేయుటకు దేవలోకమునన్న ఆకాశ గంగను నింగినుండి దింపితేవలయును. సురగంగ ఆ హిమవంతుని పెద్దకుమార్తె. ఆమె పావనమైన నదీరూపమున దేవలోకమున నున్నది. ఆమెను ఈ సగరుల భస్మరాసులపై ప్రవహింపజేసిన వారికి స్వర్గము లభించును. ఈ అరువది వేవురు ముక్తినొందు మార్గమది యొక్కటే)

గరుత్మంతుడింకను ఇట్లు పలికెను. "అంశుమంతా! నీవు మిక్కిలి భాగ్యశాలివి కనుకనే నీకీ అశ్వము దొరికినది. ఈ గుఱ్ఱమును దీసికొని పోయి సగరుని యాగమును వీరునివలె పూర్తినొందింపుము"

వైనతేయుని మాట మన్నించి వెంటనే అంశుమంతుడు హయమును తోడ్కొని సగరుని యొద్దకు బోయెను.

అతను తాతగారికి తన పినతండ్రుల వృత్తాంతము గరుత్మంతుని ఉపదేశమును చెప్పెను. విచారమున మునిగిన చక్రవర్తి కృత నిశ్చయుడై యాగమును నిర్వహించెను.

**చం॥ సగరుడు భూరమావిభుడు శ్రద్ధగ యాగము**
**నాచరించగా**
**ముగిసెను అశ్వమేథమటు మోదముతో**
**తన రాజధానికిన్**
**సగరుడు వోయి రాజ్యమును చక్కగ**
**ముప్పదివేల యేండ్లు తా**
**నగణిత కీర్తినేలె మది ఆ సురగంగకు**
**చింతనొందుచున్.**



(తా॥ శ్రీమంతుడగు ఆ సగర చక్రవర్తి శ్రద్ధగా అశ్వమేధ యాగమును నిర్వహించగా ఆ యాగము ముగిసెను. ఆ తరువాత సగరుడు తన రాజధాని జేరి ముప్పదివేల సంవత్సరముల జనరంజకముగ పరిపాలించెను. అనన్య కీర్తి నొందెను. కాని సురగంగను నింగినుండి తెచ్చుమార్గము ఎంత చింతించియు తెలియకుండెను. అటు పిమ్మట సగరుడు స్వర్గస్థుడాయెను)

సగర చక్రవర్తియనంతరము మంత్రులు మిక్కిలి ధార్మికుడైన అంశుమంతుని రాజుగా కోరుకొనిరి. అతడు పూజ్యుడైన రాజుగా పేరొందెను. అతనికి దిలీపుడు అను కొనియాడదగిన సుగుణములున్న పుత్రుడు కలిగెను.

అంశుమంతుడు సమర్థుడైన దిలీపునికి రాజ్యము నొప్పగించి అంశుమంతుడు హిమవత్పర్వత శిఖరమును జేరి గంగానదిని దెచ్చుటకై గొప్ప తపస్సును జేసెను.

మిక్కిలి కీర్తిశాలియైన అంశుమంతుడు రాజ్యభోగములందు విరక్తుడై తపస్సే ధనముగా నెంచి



ముప్పదిరెండు వేల సంవత్సరములు తపము నాచరించెను. పిదప అతడు స్వర్గము నొందెను.

దిలీప చక్రవర్తి తన తాతల దుర్మరణమును విని మిక్కిలి చింతించెను.

**కం॥ మా తండ్రి అంశుమంతుడు**
**మా తాతల పుణ్యగతికి మది చింతితుడై**
**ప్రీతిగ తపమును జేసియు**
**భూతలికిన్ గంగరాక బోయె కదలుచున్.**

(తా॥ "మా తండ్రిగారైన అంశుమంతుడు అతి దుష్కరంబగు తపస్సు చేసినప్పటికిని గంగానదిని సాధించ నసాధ్యంబయ్యెను. ఇకనేను ఆ గంగను ఏ ఉపాయమున సాధించగలను. మా తాతలకు ఉత్తమ గతులెట్లు లభించును?" అని దిలీపుడు చింతితుడయ్యెను)

ఇట్లాలోచించు వాడైనను ఆ రాజు పరమాత్మ స్వరూపము నెరింగినవాడై ఎల్లప్పుడు ధర్మబుద్ధిగలవాడై



యున్నందున అతనికి భగీరథుడను కారణజన్ముడు పుట్టెను. అతను పరమ ధార్మికుడు.

మిక్కిలి పరాక్రమశాలియైన దిలీప మహారాజు పెక్కు యాగములను సేసి దేవతల నారాధించి ముప్పదివేల సంవత్సరములు రాజ్యమేలెను.

ఆయన గంగావతరణమునకై తపము చేయకనే రోగగ్రస్తుడై కాలము చేసెను.

భగీరదుడు రాజుగా నియమింపబడెను. దిలీపుడు తన పుణ్యవశముచే స్వర్గము నొందెను. మిక్కిలి ధార్మికుడును, పరాక్రమవంతుడును, రాజర్షియు అయిన భగీరథుడు కీర్తిమంతుడైకూడ సంతానములేక బిడ్డలను వాంఛించుచుండెను.

పుత్రులు లేని భగీరథ మహారాజు తన రాజ్యభారమును మంత్రులకు ఒప్పజెప్పి నింగినుండి సురగంగను భూతలికి దెచ్చెదనని కృత నిశ్చయుడాయెను.

ఆ భగీరథుడు గోకర్ణక్షేత్రము జేరి చేతులు పైకెత్తి పంచాగ్నుల నడుమ నుండి మాసమునకు ఒక్కమాటు భుజించుచు జితేంద్రియుండై చాలాకాలము తపస్సు జేసెను.

అట్లు పెక్కు వేల ఏండ్లు జరిగిన భగీరథుని తపమునకు ప్రజాపతియైన భగవంతుడు బ్రహ్మదేవుడు ఆనందించెను.

ఆయన దేవతలగూడి వచ్చి భగీరథుని ముంగిట నిలిచి ప్రియముగా నిట్లనెను. “ఓ మహాభాగా! భగీరథ చక్రవర్తీ! నీవు చేయుచున్న ఈ నీ గొప్ప తపస్సునకు నేను కడుంగడు సంతసించితిని. నీయొక్క అభీష్టమేదియో నాకెరిగింపుము”

అత్యంత పరాక్రమశాలియైన ఆ భగీరథుడు మహాభాగ్యశాలియై చేతులు జోడించి సమస్తలోక పితామహుండైన ఆ పరమేష్ఠికి ఇట్లనెను.



**సీ॥ భగవంతుడయిన ఓ బ్రహ్మదేవా! నీవు**
**సంతసించ తపంబు సఫలమయ్యె**
**సగరపుత్రులకేను జలతర్పణంబులన్**
**జేయజాలుదు నింక చింతలేక**
**వారి దేహంబుల భస్మరాసులపైన**
**సురగంగ దిగివచ్చి పారునెడల**
**నాదు ముత్తాతలు నావరబల్మిచే**
**‘అక్షయ స్వర్గంబు’ నందగలరు**

**తే॥ భువిని ఇక్ష్వాకు వంశంబు పొందపెంపు**
**నలువ! సంతాన భాగ్యంబు నాకు నిమ్ము**
**శాశ్వతంబైన వృద్ధియు జరుగు గాక!**
**వరము లీరెండు జాలును వంతదీర్ప.**



(తా॥భగవంతుడవైన ఓ బ్రహ్మదేవా! నీవు నాతపమునకు సంతోషించినచో అది సఫలమైనట్లే. అయితే నేను సగరపుత్రులందరికి జలతర్పణంబులు సేయ గలుగుదును. ఆ సగరపుత్రుల దేహభస్మము ఆకాశగంగానదీ జలముల తడుపబడిన యెడల నా ముత్తాతలైన వారందరు అక్షయ స్వర్గప్రాప్తి నొందెదరు. అందుచే సురగంగను ప్రసాదింపుము. ఓ బ్రహ్మదేవా! నా రెండవ వరముగా ఇక్ష్వాకువంశము శాశ్వతాభివృద్ధినొందుటకు నాకు సంతాన భాగ్యము కలుగవలెను. వీనిని నాకనుగ్రహించి నన్ను కరుణింపుము)

సమస్త లోకములకు పితామహుండైన ఆ బ్రహ్మదేవుడు ఇట్లు వరములు గోరిన భగీరథుని జూచి మంగళకరములు మరియు మనోహరంబులైన సుశబ్దములు గల ఒక మాట నిట్లు చెప్పెను.

“మహారథివైన ఓ భగీరథా! నీవడిగిన మొదటి వరము బహుదుష్కరమైనది. అయినను నీ కోర్కె నెరవేరును. నీ రెండవ వరముగా ఇక్ష్వాకు వంశము నీ సంతతి వల్ల



ఆచంద్ర తారార్కము వృద్ధి చెందును”

“ఈ గంగ హిమవంతుని జ్యేష్ఠ పుత్రిక. ఈమె మహావేగమును భరింపగల శక్తిమంతుడు ఆ పరమేశ్వరుడొక్కడే”

“ఈమె నేరుగా భూమిని తాకిన ఆ వేగమును భూమి భరింపలేదు. నీవు భూపతివి గావున ఆమె మేలు కాంక్షించి, నీ పరాక్రమమును జూపి లాభము లేదని గ్రహించి గంగావతరణమునకై వ్యోమకేశుడైన ఆ శంకరుని మెప్పించి గంగాధరుడగుటకు అంగీకరింప సేయుము”

లోకకర్తయైన బ్రహ్మదేవుడు భగీరథునితో అట్లు చెప్పి గంగాదేవిని జూచి “నీవు ఈ భగీరథుడు ఎప్పుడు కోరిన అప్పుడు భూమికి బొమ్ము” అని ఆనతిచ్చి తక్కిన దేవతలతో గూడి స్వస్థలముల జేరెను.

దేవదేవుడగు ఆ పరమేష్ఠి పోగానే ఆ భగీరథుడు భూమియందు బొటన వ్రేలిపై నిలబడి ఒక సంవత్సర కాలము పరమశివుని గూర్చి తపస్సు జేసెను.

సంవత్సరము నిండగానే సమస్త లోకములకు ఆరాధ్య దైవమగు శంకరుడు, పార్వతీదేవి పెనిమిటి అయిన కైలాసనాధుడు భగీరథుని ఎదుట పంచముఖుడై ప్రత్యక్షమయ్యాడు.

ఆ పరమేశ్వరుడు ఐదు ముఖములతో భగీరథుని ఆశీర్వదించాడు. ఆ స్వామి పశ్చిమ వక్త్రము (పడమటివైపున నున్న తల) సద్యోజాతః అనబడెను. ఈయన పునర్జన్మను నివారించును. ఉత్తర వక్త్రము వాసుదేవః అనబడెను. అందరికి మృత్యువును ప్రసాదించు ఈయన కాలాంతకుడు. దక్షిణ వక్త్రము అఘోరః అనబడెను. ఈయన శాంతమూర్తి. తూర్పువైపునున్న ప్రాగ్వక్త్రము తత్పురుషః అనబడెను. ఈయన గురుమూర్తి, జ్ఞానదాత. ఊర్ధ్వ భాగమున పైకి చూచుచున్న వక్త్రము ఈశానః అనబడెను. ఈయన వేదమూర్తి. హిరణ్యగర్భునకు అధిపతి. ఆ పంచముఖ పరమేశ్వరుడు ఇట్లనెను.



**ఆ.వె॥ పురుషులందు శ్రేష్ఠ! ఓ భగీరథ! నేను**

**ప్రీతిజేత నీకభీష్టమిత్తు**

**పర్వతేశుపుత్రి పావని గంగను**

**శిరముదాల్తునింక చింతవలదు.**

(తా॥పురుషశ్రేష్ఠుడవైన ఓ భగీరథా! నీకు ప్రీతుడనైతిని. నీ అభీష్టమును నేను నెరవేర్చెదను. పర్వతరాజు హిమవంతుని పెద్దకూతురైన గంగను నా శిరస్సున ధరించెదను. నీవు నిశ్చింతగా నుండుము)

అంత లోకపూజ్యయగు ఆ హిమవంతుని ప్రధమ పుత్రిక గంగానది గొప్ప ఆకారమును దాల్చి సహింపరాని వేగముతో నింగినుండి మంగళకరంబగు జంగమయ్య పరమేశ్వరుని తలపైబడెను.

ఎంతమాత్రము ధరింపనలవికాని ఆ గంగాదేవియును "ఈ శివుని నా ప్రవాహ వేగమున తీసికొనిపోయి పాతాళంబు జొచ్చెను" అనుకొనినది.



ఆ గంగాదేవి మనోగతాభిప్రాయము నెరింగిన భగవంతుడును, త్రినేత్రుడును అయిన శివుడు, ఈ గంగానది గర్వము సహింపక కోపించినవాడై ఆ గంగను మరుగుపడునట్లు చేయదలచెను.

తన పవిత్రమైన శిరస్సున ఆ గంగ పడగానే గుహవంటి తన జటాజూటమున ఆ గంగను బంధించవలెనని మహాదేవుడు నిశ్చయించెను.

అట్లే జరిగినది. ఆ గంగ ఎన్ని ప్రయత్నములు చేసినను కపర్ధి యొక్క జటాజూటములో బంధింపబడినదియై ఆ చోటనే చిక్కువడి భూమిని చేరలేక పోయెను.

గంగ ఇట్లు శివుని జటాజూటమును పెక్కు సంవత్సరములు తిరుగువడుచుండెను. మరల భగీరథుడు ఖిన్నుడై శివుని ప్రార్థించెను.

"ఓ దీనదయళూ! మహేశ్వరా! పాహిమాం ప్రభూ! మమ్ము రక్షింపుము..



సీ॥ కాలకూటము మ్రింగి కంఠసీమను నిల్పు

గరళకంఠా! నీకు కలరె సాటి?

భూతప్రేతంబులున్ మ్రొక్కి నీ శరణొందు

శంభో! జగద్విభో! సరి ఎవండు?

సమవర్తినే బూని సంహరించిన హరా!

బ్రోవ మార్కండేయు నెవరి కవును?

సతిగోరు రావణున్ క్షమియించు ముక్కంటి!

అహి భూషణా! నీకు అధికుడెవడు?

తే॥ త్రిపురహర! శశాంకా! ఈశ! దేవదేవ!

శివ! పినాకీ! మహేశ్వరా! భవ! కపర్ధి!

ఓ ఉమాపతీ! మృగధరా! వ్యోమకేశ!

గంగ విడిపింపు సగరుల గావుమయ్య!

ఈశ్వర స్తుతి తాత్పర్యము:

(తా॥భగీరధుడు పరమేశ్వరుని చూచి పులకిత గాత్రుడై ఇట్లు ప్రస్తుతించాడు. ఘోరమైన కాలకూట విషమును మ్రింగి పార్వతీదేవి అభ్యర్థన మేరకు కంఠసీమ దాటకుండ నిలువరించిన ఓ గరళకంఠా! నిన్ను సరిబోల్చగలవారు కలరే?

ఒకప్పుడు అమృతమునాశించి దేవతలు బ్రహ్మదేవుని ప్రార్థించారు. ఆయన క్షీరాబ్ధిని చిలికితే అమృతం లభిస్తుందని చెప్పాడు. ఆ పనికి కవ్వముగా మంధర పర్వతమునెన్నుకున్నారు. కవ్వము త్రిప్పు త్రాటిగా పన్నగేంద్రుడు వాసుకిని అభ్యర్థించారు. అసామాన్యమైన ఆ కవ్వము చిలుకుటకు ఒక్కదేవతల వల్ల కాక దానవులను కూడ అభ్యర్థించి అమృతం పంచుకొనే ఒప్పందంతో క్షీరాబ్ధిని చిలకబోయారు. వాసుకి శిరస్సును దైత్యులు, తోకను ఆదిత్యులు పట్టుకొని క్షీరసాగరమధనం చేయబోయారు. మంధరగిరి చటుక్కున క్షీరాబ్ధిలో



మునిగిపోయింది. “ఓం నమో భగవతే వాసుదేవాయ” అని ప్రార్థించారు దేవతలు. కరుణించిన శ్రీమన్నారాయణుడు ఆది కూర్మావతారమును దాల్చి మంధర పర్వతము తన వీపున ధరించాడు. క్షీరసాగర మధనం ప్రారంభమైంది.

అయితే అమృతం రాలేదు. ఘోరమైన కాలకూట విషం బుసబుసలాడుతూ వెలువడింది. దాని నిలువరించ అసాధ్యమై దిక్కు తెలియక దైత్యులు తమ ఇష్టదైవమైన పరమశివుని ఎలుగెత్తి వేడుకొన్నారు. దేవేంద్రుడితో పాటు దేవతలంతా పరమేశ్వరా! పాహిపాహి అన్నారు. సదాశివుడు ప్రత్యక్షమై ఆర్తత్రాణ పరాయణుడవుట వలన సంకోచం లేకుండా ఆ కాలకూట విషమును గభాలున మ్రింగివేశాడు.

అది చూచి సర్వమంగళ పార్వతీదేవి కూడా కలవరపడి ఆ విషాన్ని మ్రింగి తన కన్యాయం చేయన్యాయం కాదని వేడుకొన్నది. అమ్మ పార్వతి అభ్యర్థన విని పరమశివుడు ఆ విషాన్ని తన గొంతులోనే



నిలువరించాడు. ధవళవర్ణుడైన పరమేశ్వరుని కంఠం ఆ విష ప్రభావంచేత నీలివర్ణమై పోయింది. ఆనాటినుంచి పరమేశ్వరుడు గరళకంఠుడై, నీలకంధరుడని ప్రసిద్ధిచెందాడు.

మానవులు చనిపోయిన తరువాత వారి పార్థివ దేహానికి దహన సంస్కారములు జరుగవలెను. అట్లుగాక ప్రమాదములలోనో రణరంగమునందుననో, అన్యదేశములలోనో దిక్కులేని చావునొందితే భూతప్రేతాత్మలవుతారని పెద్దలంటారు. వారు ఆ స్థితిలోనూ దుర్మార్గము నొదలనివారు పిశాచములవుతారని అటుగాక ఈశ్వరునే ఆశ్రయించినవారు భూతప్రేతాత్మలైనను వారికి సంస్కారము జరుగకపోయినా కర్మపరిపక్వమైనపుడు తిరిగి ఉత్తమ జన్మలభిస్తుంది.

ఇదంతా నిర్ణయించేది ఆ పరమశివుడే అందుకే ఆయన భస్మధారియై స్మశానంలో కూడ తిరుగాడుతు దిక్కులేని వారిని ఆదుకొంటాడు.



ఆ త్రినేత్రుని, శుభకరుండైన జగత్పతిని సరిపోల్చగల వారుండుట సాధ్యమా? బ్రతికున్నవాళ్ళనే పట్టించుకోని ఈ లోకంలో ఓశంభూ! నీవేకదా దిక్కు.

పూర్వం మృకండమహర్షి నిస్సంతువైనందువల్ల ఒకయాగమునకు ఆహ్వానింపబడక అవమానింపబడ్డాడు. ఆయన ఈశ్వరుని ప్రియభక్తుడగుటచే పుత్ర సంతానంకోసం ప్రార్థించగా ఈశ్వరుడు ఒక పుత్రుననుగ్రహించి వీడు నీకు పదియారు సంవత్సరముల పుత్రుడగు గాక అని దీవించి అంతర్ధానమయ్యాడు. అందరూ పుట్టిన పుత్రుడి ఆయుర్దాయం పదియారు సంవత్సరములే అని అపోహపడ్డారు. ఎంత రోదించినా ఈశ్వరుని ఆజ్ఞను ధిక్కరించలేమని సమాధానపడ్డారు మృకండు దంపతులు. పుట్టిన బిడ్డకు మార్కండేయుడని పేరు పెట్టారు.

కాలచక్రము గిర్రున తిరిగి మార్కండేయుడు పదిహేనేళ్ళవాడై రోదిస్తున్న తల్లి దండ్రులనడిగి వారి దుఃఖమునకు కారణం తెలుసుకొని తనే తలిదండ్రులను

సముదాయించాడు. జననీ జనకులారా! ఇంత చిన్న విషయానికి విచారించుట దేనికి పుట్టిన ప్రతిజీవీ గిట్టక తప్పదు కదా! ఒకరు ముందు ఇంకొకరు వెనుక. అంతే తేడా. సృష్టి స్థితి లయ కారకుడైన ఆ పరమేశ్వరుని నిర్ణయాన్ని ఎవరైనా ధిక్కరించగలరా? అయినా నేను మీ దుఃఖాన్ని చూడలేను. ఈశ్వరునే ఆశ్రయించి ఆయన శరణుపొందుతానని తపోవనానికి బయలుదేరాడు.

ఈశ్వరారాధనలో చూస్తుండగానే పదియారవ వసంతం వచ్చింది మార్కండేయునికి. అందరిలాగే పరమేశ్వరుని వరము నర్థం చేసుకోలేక సమవర్తియైన యమధర్మరాజు బాలుని ప్రాణాలు హరించుటకు యమపాశంతో ఎదుట నిలిచాడు.

యముని చూచి వణికిపోయిన బాలుడు భయవిహ్వలుడై పరమశివుని ప్రార్థించాడు. తన ఎదుటనే తన భక్తుని సంహరిస్తుంటే చూడలేని భూతనాధుడు కోపించి త్రిశూలప్రాణియై యముని సంహరించి తనభక్తుని



ప్రాణాలు నిలిపాడు. బ్రహ్మాది దేవతలు సృష్టి స్థితి లయలు త్రిమూర్తులు నిర్వహిస్తుంటే దిక్పాలురైన యమాది దేవతలు వారికి సహకరిస్తున్నారు గాని వారికే పక్షపాతము ఉండదనీ, నిరపరాధియైన యముని పునర్జీవుతుని చేయమని వేడుకొన్నారు. అప్పుడు యముని పునఃప్రతిష్ఠించిన ముక్కంటి ఇలా అన్నాడు. "సమవర్తీ! నీవు కూడ నావరం అర్థంచేసుకోలేదు. నేనన్నది వీడు నీకు పదియారు వత్సరాల పుత్రుడవుతాడు అని. అంటే ఇతనెల్లప్పుడూ పదియారు సంవత్సరాలు కల కొడుకుగా ఉంటాడని, పదియారు సంవత్సరాలు పుత్రుడుగా వుంటాడని కాదు. ఇతను చిరంజీవిగా పదియారేండ్ల ప్రాయం ఉన్నవానివలెనే ఉంటాడు. అదీ ఈశ్వర కటాక్షం అంటే. అందుకే ఆయనిని మహాకాలుడంటారు.

పై కథ చదివి అహిభూషణుడు (నాగభూషణుడు) అయిన ఆ దేవతల గురుమూర్తికి ముక్కుమీద కోపం అనుకొంటే చాలా తప్పు. ఆయన పరమదయాళువు. ఒకపుడు శంకరుని ప్రియభక్తుడైన రావణుడు తనతల్లి



కైకసిని ఊరడించుటకు పరమేశ్వరుని ఆత్మలింగాన్నే తీసుకువస్తానని కైలాసం బయలుదేరాడు. కైలాసమయితే చేరాడు కాని లోనికెళ్ళుటకు నంది, శివుని ఏకాంతం భగ్నం చేయరాదని రావణుని లోనికి పోనిరాకరించాడు. అహంకరించిన దశకంఠుడు శివుని కైలాస పర్వతంతోపాటు తీసికెళ్తానని కైలాసగిరిని పెకలించబోయాడు. వానిగర్వం అణచుటకు శశాంకుడు అయిన చంద్రశేఖరుడు తనకాలి బొటన వ్రేలితో నొక్కేసరికి కైలాసగిరిక్రింద చితికి గగ్గోలు పెట్టాడు రావణుడు. తనవ్రేగులనే చీల్చి తంత్రులవలె మీటి సామగానంతో మృగధరుని కీర్తించాడు. తన్మయుడైన వ్యోమకేశి మహాదేవుడు రావణుని వరం కోరుకోమన్నాడు. విష్ణుమాయవలన వాణి అతని నాలికపై చేరి "సర్వసంగ పరిత్యాగివైన ఓ ఉమాపతీ! నీకీ ఉమ ఎందుకు నాకనుగ్రహించు నా లంకకు రాణిని చేస్తాను అని పలికించింది. హరుడు తొణకలేదు. కేశవుని పని ఇది అని తెలిసి చిరునవ్వుతో భవానిని వానికిచ్చేశాడు. లంకలో కైకశి పార్వతిని తెచ్చిన కుమారుని నిందించింది. వాడు



తన కోపం మరల త్రిపురాంతకుడైన శంకరునిపై చూపించాడు. పరమశాంతమూర్తి అయిన పినాకి "రావణా! విష్ణు మాయ ఆవహించి ఇట్లా ప్రవర్తిస్తున్నావు" అన్నాడు. రావణుడు వినలేదు. శివుడంతర్ధానమయ్యాడు పార్వతితో సహా. విష్ణుమాయ తొలగి పోయింది. జరిగినదానికి రావణుడు దుఃఖించి తనతల నరికివేసుకున్నాడు. ఆ తల కూడ కపర్ధిని మన్నింపు వేడుకొని రోదించింది. కరిగిపోయిన ఆదిదేవుడు మహేశ్వరుడు ప్రత్యక్షమై వానిని పునరుజ్జీవితుని చేసి తన ఆత్మలింగాన్నే ప్రసాదించాడు. దానిని నేలపైనుంచిన మరుక్షణమే శిలాకృతి దాలుస్తుందని చెప్పి అంతర్ధానమయ్యాడు పశుపతి. వాడి సంకల్పం నెరవేరకుండా నారదుడు వినాయకుని ప్రేరేపించి ఆ ఆత్మలింగం గోకర్ణంలోనే నేల చేరునట్లు చేసి రావణుని సంకల్పం వికల్పమవునట్లు చేశాడు. అయితే రావణుని కథవలన ముల్లోకాలకు ఈశానుని భక్తప్రియత్వం తెలిసింది.

అటువంటి పరమశివుడు ఇప్పుడు భగీరథుని ప్రార్థన మన్నించి పొగరుబోతయిన సురగంగను తన తలపై

భరిస్తానని వాగ్దానం చేశాడు. **దయాళువువైన ఓ పరమేశ్వరా నిన్ను ఇంకా ఎట్లు కీర్తించగలను ప్రభూ! నన్ను కరుణించి గంగను విడిచిపెట్టుము.**

కరుణాంతరంగుండైన ఆ పరమేశ్వరుడు భగీరధుని తపస్సునకు, కఠోరదీక్షకు కడుంగడు సంతసించి బ్రహ్మనిర్మితమైన బిందు సరస్సున ఆ గంగను విడిచి బుచ్చెను.

**ఉ॥ ఏడు ప్రవాహముల్ కలిగెనింపుగ గంగకు భూమిజేరగా**
**మూడు మహానదుల్ అరిగె ముందుగ తూరుపు దిక్కువైపునన్**
**మూడు అదేవిధిన్ పరమ మోదముతో చనె పశ్చిమంబునన్**
**కూడి భగీరథున్ యొకటి కోరిక దీర్చగ నేగె వెంబడెన్**

(తా॥ఆ గంగను విడువగానే ఏడు ప్రవాహములు గల్గినవి. హ్లాదిని, పావని, నళిని– అను మూడు గంగలు



మంగళకర జలములతో తూర్పు దిక్కునకు ప్రవహించెను. సుచక్షువు, సీత, సింధు అనుమూడు నదులు మంగళకర జలములతో పశ్చిమ దిక్కున ప్రవహించినవి. ఏడవ గంగ భగీరథ మహారాజు వెంబడి ప్రవహించినది)

మహాతేజశ్శాలియైన ఆ భగీరథ రాజర్షి దివ్యంబగు రథంబెక్కి ముందు వెడలెను. గంగ ఆయన ననుసరించెను.

ఆకాశమునుండి ఆ పరమేశ్వరుని శిరస్సుపైబడి, అందుండి భూమిపై బడి అటుపైనుండి క్రిందకు ప్రవహించుటచే గంగానది విపరీతమైన ధ్వనితో పారినది.

అప్పుడు గుంపులు గుంపులుగా బడుచున్న మత్స్యములను, కూర్మములను, మకరములను, అనేక ఇతర జంతువులతో అవనీతలము ప్రకాశించినది అంత..

**కం॥ సురగంగ ఝరిని జూచిరి**
**సుర, యక్షులు, సిద్ధ, మునులు, సొంపుగ నింగిన్**
**అరిగిరి పలువాహనముల**
**మురియుచు "గంగావతరణమున్" కాంచంగన్.**



(తా॥ఆకాశమునందుండి మునులు, యక్ష, దేవతలు, సిద్ధులు, ఆవిధముగా ఆకాశమునుండి భూమిపై బడిన ఆ గంగానదిని జూచిరి. దేవతలు మహాశ్చర్యముతో పెద్ద పట్టణములవంటి విమానములను, గుఱ్ఱములను, ఏనుగులను యెక్కి యుండిరి. అమిత తేజోశాలురైన ఆ దేవతలు లోకమునెల్ల ఆశ్చర్యపరచు ఆ గంగావతరణమును గాంచిరి.

మేఘములు లేని ఆకాశము గంగావతరణమును చూడవచ్చిన దేవతల శరీరకాంతుల చేతను, వారి దివ్యాభరణముల ధగధగలచేతను నూరురెట్లు ఇనుమడించిన కాంతితో ప్రకాశించినది.

ఆకాశమున విచిత్రముగా మెరయుచున్న మొసళ్ళు, సర్పములు, మత్స్యములు ఆ సురగంగతో దిగివచ్చి ఎనలేని సంభ్రమము కలిగినది.

వేగము వలన వేయి విధములుగ ప్రసరించు తెల్లని నురుగులును, హంసలును కలిగి ఆకాశము శరత్కాలమందలి తెల్లని మేఘముల గుంపు ఉన్నట్లొప్పినది.



గంగానది పల్లపునేలలలో మిక్కిలి వేగవంతముగాను, మిట్టపల్లములలో వంకర టింకరగను, చదరపు నేలలలో దీర్ఘముగను, పల్లములో లోనికి వంగినట్లుగను, పెద్ద శిలలతో తాకిడి కలిగినప్పుడు ఊర్ధ్వముఖముగను, ఉన్నతమైన భూములలో మెల్లమెల్లగను ప్రవహించినది.

ఒక్కొక్కచోట అనేక పర్యాయములు జలము గాలిచే పైకెగురు తరంగములచే గొట్టబడి ఊర్ధ్వముఖముగా వెళ్ళి మఱల నేలపై బడినది.

శివుని జటాజూటమునుండి భూమిపైబడి ప్రవహించుచున్న గంగ నిర్మలపై స్నానము చేయు వారి పాపప్రక్షాళనము చేయునట్లు ప్రకాశించెను. పావనంబైన ఆ గంగను జూచి దేవతలు, ఋషులు, గంధర్వులు ఎంతో సంతోషించిరి.

**ఆ.వె॥ శివుని దేహస్పర్శచే పునీతంబైన**
**గంగయందు మునక గఱపు ముక్తి**
**శాపగతిని బాసి స్వర్గంబు నొందిరి**
**సురులు గంగమునిగి శుద్ధిజెంది**

(తా॥ఈశ్వరుని దేహ స్పర్శవలన పునీతమైన ఆ గంగలో మునక తప్పక ముక్తినిస్తుంది. స్వర్గమును శాపవశమున గోల్పోయిన దేవతలు ఆ గంగలో మునిగి పవిత్రులై శాపవిముక్తులై ఆనందంగా భువినుండి తిరిగి స్వర్గం చేరారు)

ఆకాశ మార్గమున వారందరు తమతమ నెలవులు చేరుకొనిరి. ప్రకాశమానంబైన ఆ గంగాజలములను జూచి జనులు మాటిమాటికి ఆనందపరవశులై ఆ గంగాస్నానాంతరము బడలిక తీరి సుఖమునొందిరి.

రాజర్షియైన భగీరథుడు దివ్యమైన రథమునెక్కి ముందుపోవుచుండగా గంగానది దానివెంబడించి పోవుచుండెను.

దేవతలు, ఋషులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, గంధర్వులు, యక్షులు, కిన్నెరులు, ఉరగములు, అప్సరసలు మొదలైనవారు సంతోషముతో భగీరథుని రథమును వెంబడించుచు గంగానది ననుసరించిరి. అట్లు జలచరములు కూడ వెంబడించినవి.



భగీరథుడేమార్గమున బోయెనో పావనియైన గంగాదేవియు ఆ మార్గముననే ప్రవహించెను. అంతనా గంగాదేవి మిక్కిలి ఆశ్చర్యకరమైన మహాత్మ్యముగల "జహ్ను" మహర్షి యాగము చేయుచున్న యాగశాల మీదుగా ప్రవహించి దానిని జలములలో ముంచెత్తెను. ఆ జహ్నువు ఆగ్రహోదగ్రుడై..

చం॥

సలిలమునంతయున్ అపుడు జహ్నువు పుక్కిలి బట్టి వైచె తాన్
ఒలకదు బిందు వొక్కటియు యుర్విని సంభ్రమ విభ్రమంబులన్
కలిగిన నింగిదేవతలు గంగనొసంగమనంచు వేడగా
చెలువము తోడ తానొసగె చెవ్వులనుండి సుపుత్రిగా గొనెన్

(తా॥మహానుభావుడైన జహ్ను మహర్షి ఆ గంగానదిని పుక్కిలిలో బంధించి నిలిపివేసెను. ఒక్కబొట్టు నీరు కూడా బయటకు చిందలేదు. సమస్త దేవగంధర్వాది దివిజులు మహాశ్చర్యంతో జహ్నువును ప్రార్థించి పరోపకారార్థం ఆమెని మన్నించమని వేడుకొన్నారు. ఆయన ప్రసన్నుడై ఆమెని మన్నించి తన పుత్రికవలె స్వీకరించాడు. ఆమె



తనకుమార్తెగా తన చెవినుండి బయటకు విడచెను)

ఆనాటి నుంచి గంగానదికి "జాహ్నవి" అను పేరు వచ్చింది. గంగానది మరల భగీరథుని రథమును వెంబడించుచు వెళ్ళినది. పిదప గంగ సముద్రము ప్రవేశించి భగీరథుని కార్యము సఫలీకృతమగునట్లు పాతాళమునకు బోయెను.

భగీరథుడు మహాయత్నంబున గంగాసమేతుడై తన తాతల బూడిద రాసులను మిక్కిలి దుఃఖముతో సమీపించెను.

అంత శ్రేష్టము, పావనము యైన ఆ జాహ్నవి సగరుల బూడిద రాసులపై చక్కగా ప్రవహించి వారి పాపములను ప్రక్షాళనము గావించెను. ఆ సగరపుత్రులు నిష్పాపులై స్వర్గము నొందిరి.

అట్లు సగరపుత్రులనుద్ధరించుటకు నిస్వార్థమున అకుంఠిత దీక్షతో గురుతర తపంబాచరించి వచ్చిన అడ్డంకుల నెల్ల అధిగమించి పరమేశ్వరునే మెప్పించి



పరమేష్ఠిని ప్రసన్నుని చేసికొనిన భగీరథుని జూచి బ్రహ్మదేవుడు స్వయముగా ప్రసంసించుచున్నాడు.

'నింగిని దిగిన సురగంగ', దుర్మార్గులై కపిల మహర్షి ఆగ్రహాగ్ని జ్వాలలో దగ్ధమై బూడిదరాసులైన సగరులను పునీతులను జేసి స్వర్గప్రాప్తి నందించినది.

**సీ॥ స్వర్గంబునందలి సగరుని సుతులెల్ల**
**దేవతలంబోలి దివ్యులైరి**
**భువిని సంద్రములన్నివున్నంత కాలంబు**
**వారుందురచటనే పురుష శ్రేష్ఠ!**
**"భాగీరథి" గ గంగ బడయును నామంబు**
**"త్రిపథ" గా తను ప్రసిద్ధినిని గాంచు**
**జలతర్పణము సేసి సాధించితివి నేడు**
**ప్రతినయు నీది సమాప్తి అయ్యె**

**తే॥ సగరుడును ఇట్టి కీర్తిని జాడ గనడు**
**అంశుమంతుడు కామితంబరయలేదు**
**తండ్రియైన దిలీపుని తరము కాదు**
**నీవు కారణజన్ముండవవుట నిజము.**

(తా॥పురుష శ్రేష్ఠుడవైన భగీరథా! మహాత్ముడగు సగరుని యొక్క పుత్రులు అరువది వేలమంది నీచే తరింపబడి స్వర్గంబు నొందిరి. ఈ పృధ్విపై సముద్రజలము లెందాక ఉండునో అందాక ఈ సగరులు సంతోషముగా స్వర్గమున నుండెదరు. సముద్రమునకు సాగరమును అని పేరు వచ్చును. గంగ నీపెద్ద కుమార్తెగా లోకమున 'భాగీరధి' అనే పేరుతో పిలువబడును. స్వర్గమున బుట్టి, భూమిపై ప్రవహించి, పాతాళమున సగరులను బ్రోచి 'త్రిపధ' గా ఈ గంగ ప్రసిద్ధినొందును. నీవు ఈ పవిత్ర గంగాజలములతో నీ పెద్దలందరకు తర్పణములిమ్ము. నాయనా! నీ ప్రతిజ్ఞ పరిసమాప్తి నొందినది. నీ పూర్వీకులైన సగరుడు, నీతాత అంశుమంతుడు, నీ తండ్రి దిలీపుడు మొదలైన ఎవ్వరికినీ ఈ కీర్తి దక్కలేదు. నిజముగా నీవు కారణ జన్ముడవు)

శత్రువులనడగంద్రొక్కు (అరిందముడు) భగీరధా! నీకు మహోన్నతమైన ధర్మప్రతిష్ఠ కలిగినది.



నాయనా! సముద్రమున ఎప్పుడు బడితే అప్పుడు స్నానమాచరించరాదు, కాని ఈ పవిత్రగంగానదిలో ఎప్పుడైనను పరిశుద్ధ స్నానమాచరించవచ్చును. నీవిప్పుడే స్నానమాచరించి పరిశుద్ధుడవై పుణ్యంబు నొందుము. నీ కోర్కెలన్నియు తప్పక సిద్ధించును. నీకు మంగళములు సిద్ధించుగాక!

ఇక నేను నాలోకమునకు బోయెదను, నీవును బొమ్ము అని బ్రహ్మదేవుడు అంతర్ధానము నొందెను.

సమస్త ప్రాణులకు తాతగారైన ఆ చతుర్ముఖుడు బ్రహ్మలోకము పోగానే భగీరధుడు సగరుడాది పెద్దలందరకు జలతర్పణంబులు సేసి తన రధమునెక్కి తన రాజధానికి బోయెను.

సమృద్ధముగా సంపదలు గల్గి, ఏ దుఃఖము లేక అభీష్టములు సిద్ధించి ప్రజలందరు ఆ భగీరధుని పాలనలో సర్వాభీష్టములను పొందిరి. సద్వర్తనులై నిలిచిరి. మంగళములనొందిరి.



**"ఓ దాశరథీ! సంధ్యాకాలము కావచ్చినది. ఈ గంగావతరణ గాధనాలకించి తృప్తుడవైతివి గదా! ఈపై అడుగవలదు. ఈ పుణ్యగాధ నాలకించిన కలుగు సత్ఫలితము వినుము.**

**కం॥ "గంగావతరణ" చదివిన**
**మంగళములు కలుగు ప్రజకు, స్వర్గము దక్కన్**
**నింగిని 'పితరులు' ముదమున**
**పొంగుదురిక ఇంతకన్న 'పుణ్యము' కలదే!!**

**(తా॥ఫలశ్రుతిః దీనిని భక్తితో చదివినా, చదివిన దానిని వినినా ఈ సత్ఫలితము కలుగునని చెప్పుచున్నారు. ఈ గంగావతరణము కథను విశ్వామిత్ర మహర్షి తనయాగ సంరక్షణార్ధం తీసికొని పోతున్న రామలక్ష్మణులకు ఎఱింగించెనని ఆదిలోనే తెలుపబడినది. విశ్వామిత్ర మహర్షి ఈ గంగావతరణము విన్న ఫలితమునిట్లు తెలుపుచున్నారు.**



**బ్రాహ్మణులు గాని, క్షత్రియ యాది కులజులు గాని, అన్యజాతీయులు గాని ఎవరైనా, తాము ధనమును, కీర్తిని, దీర్ఘాయువును, సుపుత్రులను, దేహత్యాగము తరువాత స్వర్గమును కోరుకొనిన ఈ గంగావతరణోపాఖ్యానమును భక్తి శ్రద్ధలతో వినిపించవలెను (చదువ వలెను). అట్లు జేసిన అతని పితృదేవతలు, అతను నమ్మి పూజించు దేవతలు మిక్కిలి సంతసించి దీవింతురు.**

**దీనిని విన్నవారుకూడ మంగళకరమగు ఈ గంగావతరణము వినుటచే కోరికలు సిద్ధించి పాపములు నశించి, కీర్తి, ఆయుస్సు వృద్ధిజెంది సుఖము నొందెదరు.**

సర్వేజనాః సుఖినోభవంతు